శ్రీః

# బీజాక్షరనిఘంటుః

వ్యాఖ్యాత : మేళ్లచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి




ప్రకాశకులు :

**స్వామి సహజానంద**

విజయవాడ.

శ్రీః

# బీజాక్షరనిఘంటుః

సంకలనాత్మక రచన

**మేళ్లచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి**


***ముద్రణ : జనవరి-2015***

***ప్రతులు : 500***

***పేజీలు : 60***

***వెల రూ. : 50-00***





**RAVI MOHAN RAO,** M.Sc., M.A.,
Dandy House,
Flat No : 404, Janjanam Complex,
Opp. I Town Police Station,
CHIRALA-523 155, Prakasam Dist.
Cell : 9440115411



***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

***Printed at -***
**Karshak Art Printers,**
**HYDERABAD**

శ్రీః

# బీజాకరణము

**"శ్వాసో నాదః"** అని శాకటాయనసూత్రం. ఈ విషయం అనుభవసిద్ధమే. కనుకనే మాట్లాడుతూ మధ్యలో, గ్రుక్కత్రిప్పుకోవటం అనేది చేస్తాం. కనుక **"ప్రాణవిద్య, నాదవిద్య"** ఒక్కటే. నోటి నుంచి వచ్చే గాలి శ్వాస. మనం పీల్చే గాలి ప్రాణము. ఈ గాలి నోటి నుంచి వస్తూ స్థానప్రయత్నాలను బట్టి నోటిలో జిహ్వాగ్రం చేసే లాస్యం వలన నాదంగా, శబ్దంగా, అక్షరంగా రూపాంతరాలలో పరిణమిస్తుంది. వేదం భగవంతుని **"శ్వాస"** అని ఉపనిషత్తు చెప్తున్నది. **"తస్మైవ మహతో భూతస్య నిశ్వసితమేతత్ యదృగ్వేదో యజుర్వేదస్సామవేద ఇతి"** శబ్దభాగాలు లేదా అక్షరాలు బీజాక్షరాలు. వాటి అంత్యభాగాలు నాదాలు. నాదం దేనికయినా ఒకటిగా ఉంటుంది. అందువలన ప్రతి బీజానికి సాధారణంగా (95 శాతం వరకు) అనుస్వారంతో ముగింపు ఉంటుంది. అంటే వైఖరీ రూప శబ్ద భేదములన్నియు, మధ్యమారూప నాదంలోకి కరగిపోవాలి. ఈ నాదం సమాధిలో నాదాంతమయిన బ్రహ్మంలో కరగటమే జపలక్ష్యం. లేదా నాదవశీరణంతో అక్షరాలను ఆయుధాలుగా మార్చి మంత్రాలనుగా చేసి ప్రయోగించి కామ్యకర్మలు సాధించటం దేవతా వశీకరణం, యక్షిణీసాధనం మొదలైనవి చేయవచ్చును. ఇదొక పద్ధతి. దేనికయినా నాదానుసంధానం ముఖ్యం. ఈ అనుసంధానానికి అక్షరాలు ఉపకరణం. మంత్ర, యోగ, ఆగమాల ప్రకారం అక్షరములు మనలోనే షట్చక్రాలలో అంతర్గతంగా ఉంటాయి. అదే **"అంతర్మాల"** దీనితో బహిర్గతజపాన్ని అనుసంధానం చేస్తూ చేసే యా అంతరక్షమాలాజపం శీఘ్రసిద్ధికరం అని ఆగమవాక్యం. అంతర్గతమయిన అక్షరాలను ఆయా స్థానాలను మనస్సుతో బహిరంగజపమాలతో పోల్చు కోవటం అంతరక్షమాలా జపం. తద్వారా మనలోని వర్ణ, నాదశక్తిని బలోపేతం చేస్తాం. దీనివలన జపసిద్ధి, తపస్సిద్ధి, వాక్శుద్ధి, కవితాధార మొదలైనవి లభిస్తాయి. ఈ వ్యవహారమంతా శరీరములోని సుషుమ్న, చక్ర, పద్మవ్యవస్థలో ఉన్నదని యోగశాస్త్రం చెప్పుతున్నది. ఆ వాక్యాలు చూద్దాం.

నాదం దేహమధ్యలో ప్రారంభం అవుతుంది. దేహమధ్యం అంటే నాభి క్రింది ఒక అంగుళం ప్రదేశం.

**ఆధారాత్ ద్వ్యంగుళాదూర్ధ్వం**
**మేహనాత్ ద్వ్యంగుళాదధః ।**
**ఏకాంగుళం దేహమధ్యం**
**తప్త జాంబూనదప్రభమ్ ॥**

అందుకే బలహీనంగా మాట్లాడే వానిని చూచి, 'వాడు బొడ్డు క్రింద నుంచి లాగుతున్నాడు' అంటాము. ఈ మాట శాస్త్రవాక్యానికి అనుభవదర్పణం వంటిది.

ఈ స్థానంలోనే 'పరానాదం' ఉంటుంది. అంటే నాద పరమాణుదశ. నాద ప్రారంభదశ. ఇది ఒక అనాహతమయిన సంకల్పరూపమయిన "స్పందన" మాత్రమే. కనుకనే నాదం గురించి చెప్తూ – **"పరాయాం అంకురీభూత్వా"** అన్నారు. అంతేగాక.

**"మూలాధారగతా శక్తిః సా పరా బిందురూపిణీ"** అన్నారు. బిందు రూపమయిన పరావాక్కు మూలాధారమున ఉన్నదని అర్థము. నాదం ఏర్పడటానికి కారణం శ్వాస. లేదా ప్రాణం అని యింతకు ముందే చెప్పాము. అయితే దాంతో బాటు అగ్ని గూడా కలవాలి. ఈ అగ్ని జీవశక్తియే. శక్తి లేనిదే శ్వాస సాగదు. బ్రతుకు లేదు. కనుక జిహ్వలోని శక్తి, శ్వాస – రెండూ కలిసి నాదోత్పత్తి చేస్తాయి. అందువలననే 'నాద' శబ్దాన్ని

**"న"** = ప్రాణబీజం అని

**"ద"** = అగ్నిబీజం అని సంకేతించారు.

మన నోట్లోను బయటను పుట్టే నాదం **'ఆహత నాదం'**. కాని మన దేహ మధ్యంలోను పంచభూతాలలోను ఉండే అవ్యక్తనాదం **అనాహతం**.

**"ఆకాశ సంభవో నాదో యస్సో నాహత సంజ్ఞితః"**. ఈ అనాహత శబ్దం అణువులోను ఉంటుంది. ఇది అత్యంత సూక్ష్మనాదం. పరాపశ్యంతీ మధ్యమాస్థితులు గల యీ నాద విశేషాలు కర్ణేంద్రియాలకు అందవు. మనస్సు మాత్రమే వీటిని గ్రహిస్తుంది. స్వప్నంలో జరిగే మాటలు గూడా కర్ణేంద్రియాలకు అందవు. ఇవి కేవలం మనోబుద్ధిచిత్త గ్రాహ్యాలు. ఒక్క వైఖరీ వాక్కు మాత్రమే కర్ణగ్రాహ్యం.

తరంగాలు లేని నీటిలో గాలివలన తరంగాలు పుట్టి చివఱకు నీటిలోనే కలిసిపోతాయి. అలాగే ఆకాశంలో వాయువు వలన పుట్టిన శబ్దము ఆకాశంలోనే లీనం అవుతుంది. బ్రహ్మమునందు పుట్టిన 'నేను' అనే నాదం చివఱకు 'బ్రహ్మం' లోనే లయం అవుతుంది. అదే నాదాంతం. కనుకనే 'నాదం' అంటే సృష్టి. అందుకే దేవి నాదమయి మూల ప్రకృతి.

**అనాహతనాదం** – Air వంటిది.

**ఆహతనాదం** – Wind వంటిది.

లౌకిక నాదాలన్నింటిలోనికి ప్రశస్తం అయినది జంతునాదం. అందున మనుష్యనాదం ప్రశస్తతరం. చక్కని ధ్వని, ధ్వనిభేదాలు, స్వరాలు, అక్షరాలు, అర్థాలు,

నానార్థాలు, వ్యంగ్యాలు – వెల్లివిరిసిన శబ్ద శక్తి (నాదశక్తి) మానవ నాదం. ఇది జ్ఞాన కారణం. మోక్షకారణం. భాషారూపమయిన ఈ నాద ప్రపంచం చేయలేనిది లేదు. ఈ నాదాలలోని అతిముఖ్యమయినది **"ఓం"** కారనాదం.

ఇది బీజత్రయ స్వరూపం. దీనిలో **"అ+ఉ+ం"** అన్న 3 భాగాలు లోకంలోని సర్వ త్రిపుటీ సమూహమునకు ప్రతినిధులు. ఆధ్యాత్మిక సాధనలో ఈ నాదమునకు (ఓం)

**అ = హృదయము వఱకు, ఉ = కంఠము వఱకు, ం = భ్రూ మధ్యము వఱకు** మంద్ర మధ్య తారస్థాయిలో ఉచ్చారణ జరుగుతుంది. తరువాత అతి తారస్థాయిలో లేదా పరాస్థాయిలో ఈ నాదం నాదాంతం వైపు సూక్ష్మచక్రరూపాలతో దూసుకొని పోతుంది. ఇది మోక్షప్రదం. కనుక 'నాదరాజం' ఓంకారం.

శ్వాసకు మనస్సుకు సంబంధం గూర్చి యోగశాస్త్రంలో చాలా చెప్పారు. శ్వాస ఆగితే మనస్సు ఆగుతుంది. మనస్సు ఆగితే శ్వాస ఆగుతుంది.

**"ప్రాణబంధనం హి సోమ్య మనః"** అని శ్రుతి.

**"యః ప్రాణపవనస్పందః చిత్తస్పందస్స ఏవ హి"** యోగవాశిష్ఠం. మొదటిది యోగులు, రెండవది జ్ఞానులు సాధన చేస్తారు. ఈ శ్వాసనే మంత్ర యోగులు నాదంగా ఉపాసన చేస్తారు. కనుక నాదంలో మనస్సు లీనం అవుతుంది. మనస్సు నశిస్తే సృష్టి లేదు. సంసారం లేదు. అదే మోక్షస్థితి. నాద మనస్సులు ఐక్యం పొందితే 'నాదం' దీపశిఖలాగా జ్వలిస్తూ కుండలినీరూపం పొందుతుంది. కుండలిని అంటే నాదశక్తే గదా!

చూడామణి ధరించిన నాగ కన్యలాగా, లంకాదహనం చేసిన హనుమ ద్వాలంలాగా, కాళిదాసు వర్ణించిన ఇందుమతిలాగా బయలుదేఱిన యీ దీపశిఖ మార్గ మధ్యమున గల సర్వదేవతలను, సర్వ వర్ణములను కటాక్షిస్తూ, పుట్టవిడిచిన పాములాగా వేగంగా సహస్రారం వైపు దూసుకొని పోయి అచ్చటి పరంజ్యోతిలో లయమగును. అదే **మంత్రయోగలక్ష్యం.**

ఒక నిప్పురవ్వ తనలోని "బొగ్గుతనం" వదలి నిప్పులో కలియటం, దీపకాంతి దీపంలో కలియటం, వెన్నెల నెలవంకలో కలియటం – అదే జీవశక్తి పరంజ్యోతిలో కలియటం. కుమారసంభవంలో కాళిదాసు ఇందుమతీ స్వయంవరం వర్ణనలో,

**సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ**
**యం యం వ్యతీయాయ పతింవరా సా ।**

**నరేంద్ర మార్గాట్ట ఇవ ప్రపేదే**
**వివర్ణభావం సస భూమిపాలః ॥**

అన్నాడు. దీనివలన ఆయనకు **"దీపశిఖా కాళిదాసు"** అని పేరు వచ్చింది.

యోగంలోను, కావ్యంలోను **భర్త = అజుడు, భార్య = ఇందుమతి.** ఇద్దఱు అజులే. ఈ యిద్దఱు పతింవరలే. అది నరేంద్ర మార్గమే. నారాయణ మార్గమే. ఆయా భూములను భూమికలను పరిపాలించే రాజులు దేవతలు. వారు తమ 'వర్ణాలను' కోల్పోయినారు. ఇదేదో అనుకోకుండా లభించిన సామ్యం కాదు. తరువాత వర్ణన గూడా కవికుల గురువు ఇలానే కొనసాగించాడు.

**"నహి ప్రఫుల్లం సహకారమేత్య"** అని. 'సహకారం', 'ప్రఫుల్లం' అన్నాడు. అంటే వికసించిన ఆజ్ఞాచక్రం లేదా విశుద్ధచక్రం అని అర్థం. ఆజ్ఞాచక్రంలో **'హం, క్షం' బీజములు,** కంఠచక్రములో **'హం' బీజము** ఉంటాయని యోగశాస్త్రం. అయితే అచ్చటనే **"వృక్షాంతరం కాంక్షతి షట్పదాళిః"** అన్న కాళిదాసు క్ష కార ద్విరుక్తి వలన ఆజ్ఞాచక్రాన్ని సూచించినట్లే కదా! పైగా **'షట్పదాళిః'** అనగా షట్చక్రములకు స్నేహితురాలయిన **'భ్రామరీ'** (నాద) శక్తిని సూచించినాడు. అందువలననే కాళిదాసుకు వ్యాస వాల్మీకుల తరువాత స్థానం దొరికింది. పనికిమాలిన శృంగార వ్యంగ్యాలు కాక ఆధ్యాత్మిక జీవేశ్వర శృంగార ధ్వనిని, తన గ్రంథంలో అలవోకగా నిబంధించినవాడు కాళిదాసు. శ్రీహర్షునివలె ఎచ్చటను బయటపడలేదు. భవభూతి గూడ ఇటువంటివాడే. అందుకే **"కిమపి కిమపి మందం-"** అనే శ్లోకం సీతారాముల అసిధారావ్రతానికి, అసంగయోగానికి ఉదాహరణమని మా గురువు గారు **"నాకు తోచిన మాట"** అనే గ్రంథంలో వ్యాఖ్యానించారు. కనుకనే కాళిదాసు **"కవికులగురువు."**

ఇక అసలు విషయానికి వస్తే; బీజములను ఇందులో రెండు రకాలుగా విభజించాను.

1) అక్షర బీజములు : మామూలు అక్షరాలు అం, ఆం, ఈం మొదలైనవి

2) బీజాక్షరములు : హ్రీం, గ్లీం, హ్సౌం.

అనగా సంయుక్త బీజములను 'బీజాక్షరములు' గా చెప్పినాను.

# బీజోత్పత్తి

ఈ బీజములను ఏర్పాటు చేసిన పద్ధతులు కొన్ని ఇక్కడ చర్చించుదాం.

1) సహజ ఏకాక్షర పదాలు తమకు నిఘంటు ప్రసిద్ధమయిన అర్థములోనే ఇందులో బీజాక్షరాలుగా వచ్చినవి.

ఉదా॥ ఖం = ఆకాశబీజము
కం = జలబీజము

2) పదంలో మొదటి అక్షరాన్ని బట్టి కొన్ని అక్షరాలు బీజాక్షరాలు అయినవి.

ఉదా॥ చూ = **నామాద్యక్షరమ్ బీజమ్**
స = సుదర్శనబీజము
ర = రక్తబీజము
గ = గణపతి బీజము
వ = వరుణబీజము

3) 2వ అక్షరాన్ని బట్టి కొన్ని బీజాక్షరాలు ఏర్పడినవి.

ఉదా॥ రథం = థ = రథ బీజము.

4) ఒత్తులలో ఉన్న అక్షరాలను బట్టి కొన్ని బీజాక్షరాలు అయినవి.

ఉదా॥ స్థిర = థ
స్థాయి = థ

5) నాగరిలిపిలోని అక్షరాల ఆకారాలను బట్టి కొన్ని బీజాక్షరాలు వచ్చినవి

ఉదా॥ ః = కన్యాస్తనములు ट = కుండ
ढ = శంఖము ओ = హలి

6) అనేకాక్షర బీజములకు అర్థం ఎటూ ఉండును కనుక వాటి అర్థమే ఆ బీజము.

**"అనేకాక్షరబీజేన స్వస్వబీజం స్వనామకమ్"**

ఉదా॥ స్వాహా = ఇది స్వాహాదేవి బీజము.

ఇలా ఇంకొన్ని విధాలుగా బీజములు అక్షరముల ద్వారా దేవతలకు సంకేతింప బడినవి. అవి పాఠకుల ఊహకు వదలబడినవి.

**విషయ సంఖ్య :-**

1) ఈ బీజాక్షరములలో చాల వస్తువులు, దేవతలు, రాక్షసులు మొదలగునవి సంకేతింప బడినవి. అన్నింటిని విడదీయుట కష్టము కనుక కొన్నింటిని ప్రత్యేక శీర్షికలుగా చూపితిని. ప్రధానముగా ఇందు చెప్పబడినవి.

*(1) దేవతలు, (2) రాక్షసులు, (3) ఋషులు, (4) తారలు, (5) రాశులు, (6) పంచభూతాలు, (7) దశావతారాలు, (8) షడ్రసాలు, (9) సప్తవర్ణాలు, (10) తిథులు, (11) కొండలు, నదులు, సముద్రాలు, (12) అవయవాలు మొదలైన పేర్లు వచ్చినవి.*

2) ఇందులో కొన్ని భయంకరాకారములయిన పేర్లు వచ్చినవి.

ఉదా॥ ఐం = వికృతముఖి

నిజానికిది సరస్వతీబీజం. దీనినే 'వికృతముఖి' అని చెప్పారు. బహుశః ఇవి ప్రయోగాలు, వామాచార పూజలు. యక్షిణి ఉపాసనలు మొదలైన కామ్యకర్మల వారికి అవసరము కావచ్చును.

**ప్రయోజనం :-**

1) మంత్రాకారాలను బీజరూపాలను మంత్రవేత్తలు మామూలు భాషలో ప్రత్యక్షముగా చెప్పరు. మంత్ర దేవతలు పరోక్ష ప్రియలు కనుక మంత్రము లున్న స్వమాతృజార తుల్యముగా గోప్యములు. కనుక నిఘంటువులో చెప్పిన పర్యాయ పదాలతో మంత్రాకారములను అందుకు కావలసిన బీజ రూపములను సూచించెదరు. ఉదాహరణకు "ప్రీం" అను బీజము. ఇది మంత్రశాస్త్రములో అంటే 'తంత్రాభిధానం' లోని బీజనిఘంటువులో ఈ విధంగా చెప్పబడినది.

**కపర్దినం సమాధాయ**
**క్షతజోక్షితసంస్థితమ్ ।**
**సంయుక్తం ధూమ్రభైరవ్యా**
**ధ్వాంక్షోయం నాదబిందుమాన్ ॥**

అనగా 'ప్రీం' అనేది ధ్వాంక్షబీజము. దీనిని కపర్దితో (ప) క్షతజోక్షి తము (ర) తో కలిపి ధూమ్ర భైరవితో (ఈ) చేర్చి నాద (U) బిందువులు (ం) తగిలిస్తే 'ప్రీం' అవుతుంది. ఈ గుప్త భాష తెలిసికోటానికి బీజనిఘంటువు అవసరం. అలాగే సాంఖ్యాయన శ్రుతి పంచదశిని,

**"కామో యోనిః కమలా వజ్రపాణిః"** మొదలగు నాలుగు పాదముల మంత్రముతో గుప్త బీజ భాషలో చెప్పినది. కనుకనే **"మాతృకావర్ణ సంజ్ఞాస్తాః తాః జ్ఞాత్వా చోద్ధరేన్మనుమ్"** అని మాతృకా నిఘంటువు చెప్పింది. కనుక మంత్రోద్ధారానికి బీజ నిఘంటువు అవసరము.

2) ఇంతేగాక కవులు తమ గ్రంథంలో తమతమ ఇష్టదేవతామంత్రాలను ముద్రాలంకారంగా బంధించేందుకు ఈ 'బీజ నిఘంటువు' అవసరమే.

3) శరీరావయవాలకు బీజములున్నవి. వాని వలన వచ్చే ప్రయోజనమును ప్రకారాంతర మాతృకా నిఘంటువు ఇలా చెప్పింది.

**శ్లో॥ విస్ఫోటనాయ మంత్రాణాం - సలీలం పండితైః జనైః ।**
**శరీరే సర్వమంత్రాణాం - ఉద్ధారాయ సుబుద్ధిభిః ॥**

(మాతృకా నిఘంటువు)

శరీరమునందు నాదం, అక్షరాలు ఉన్నవని యోగమతము. కనుక ఈ బీజోపాసన వలన ఆయా శరీరావయవములందు మంత్రోద్ధారము చేయవచ్చును. ఆయా మంత్రస్థానములను చైతన్యభరితం చేయవచ్చును.

**అవధేయము :-**

1) బీజాలలో కొన్నిచోట్లు 'ఈశ' 'అంబ' పదాలు ఇతర పదాలతో కలిపి వాడారు. వాటికి ప్రత్యేక అర్థములు లేవు.

ఉదా॥ క = క్రోధ, క్రోధీశ; ద = దారుక, దారుకేశ.

2) హ్రస్వ బీజాలు, దీర్ఘ బీజాలు ఒకే అక్షరం అయితే కొన్ని పోలికలున్నాయి. అర్థాలు కలుస్తాయి.

ఉదా॥ 'అ' వద్ద ఉన్న కొన్ని పేర్లు, 'ఆ' వద్ద ఉన్న పేర్లతో సమానంగా ఉన్నాయి. సం-సాం = రెండున్నూ సుదర్శన బీజాలు.

3) తంత్రాలలో ఉండే మతభేదాల వలన కొన్ని పేర్లు సమానంగా వస్తున్నాయి. కాని బీజాక్షరాలు మాత్రం మారుతున్నాయి.

ఉదా॥ కే = వామబాహు - కొండలు, దక్షిణజాను - కొండలు
ఠే = వామబాహు - కొండలు, దక్షిణబాహు - కొండలు

4) ఒక విషయానికి ఒక నిఘంటువులోనే అనేక పర్యాయపదాలు ఇచ్చారు. కాని అవి అన్ని ఒక్కటే

ఉదా॥ శివ, శ్రీకంఠ, హర, త్రినేత్ర మొదలైనవి.

# బీజార్థములు

వేదమంత్రములు సాధారణముగా అర్థవంతమయిన పదాలతో ఏర్పడును. అందుకు గాయత్రీ మంత్రమే ఉదాహరణము. కాని తాంత్రికమయిన బీజాక్షర మంత్రములలో అర్థం తెలియని శ్రీం, అం, శం లాంటి వర్ణములే ఉండును. దానిమ్మపండులో గింజలవలె ఉండే ఈ అక్షర రత్నాలు పరస్పరం బంధం లేనట్లు వెలుగుచుండును. అట్లని నిరర్థకములు అనరాదు. నిరర్థకమయిన మంత్రములు ఏ దేవతలను తృప్తి పఱచును? మంత్రం అంటే ఒక స్తుతి. ఒక ప్రార్థన. అర్థమున్నపుడు ఆ 'గుణం' సాధ్యం అవుతుంది. కనుక బీజాక్షర మంత్రాలకు అర్థాలు తప్పనిసరి. వాక్యానికి అర్థం ఉన్నపుడు వాక్యగతమయిన పదాలకు గూడా ఆ అర్థభాగాలు పంచాలి. అలాగే మంత్రం మొత్తం మహావాక్యం అయితే మంత్రగత బీజాలకు అర్థం తప్పక ఉండాలి. కనుక బీజాక్షరాలకు అర్థం తప్పదు. అందుకే బీజ నిఘంటువులు వచ్చినవి. పంచదశీ మంత్రార్థం గూర్చి వ్రాస్తూ **భాస్కరరాయపండితుడు "వరివస్యారహస్యం"** లో చెప్పిన విషయలాలను చూస్తే మంత్రార్థ విధానాలు తెలుస్తాయి. మంత్రప్రయోజనం మంత్రార్థ జ్ఞానంలోనే ఉందని తెలుస్తుంది.

**శ్లో॥ నార్థజ్ఞానవిహీనం - శబ్దస్యోచ్చారణం ఫలతి ।**
**భస్మని వహ్ని విహీనే - న ప్రక్షిప్తం హవిః జ్వలతి ॥ 1**

అర్థజ్ఞానం లేని మంత్రపఠనం బూడిదలో నేయి పోసిన చందం అని.

**శ్లో॥ అర్థమజానానాం - నానావిధశబ్దమాత్రపాఠవతామ్ ।**
**ఉపమేయః చక్రీవాన్ - మలయజభారస్య వోఢైవ ॥ 2**

అర్థం తెలియని మంత్రవేత్త చందనం మోసే గాడిద అట.

**శ్లో॥ పురుషార్థానిచ్ఛద్భిః - పురుషైరర్థాః పరిజ్ఞేయాః ।**
**అర్థానాదరభాజాం - నైవార్థః ప్రత్యుతానర్థః ॥ 3**

పురుషార్థచతుష్టయంలో ఏదికావాలన్నా అర్థం ఎఱిగి సాధన చేయాలి. నిరర్థకమయిన సాధన అనర్థం గూడా తెస్తుందట.

ఇలా చెప్పిన ఆ భాస్కరరాయ పండితుడు పంచదశిని గూర్చి పంచదశీ (15) సంఖ్యలో అర్థాలను వ్యాఖ్యానించాడు. అయితే పంచదశీమంత్రంలో కేవలం పొడి పొడిగా 15 అక్షరాలు మాత్రం ఉన్నాయి. వాటికి ఈ అర్థాలు ఎక్కడివి. ఈ అర్థ వ్యాఖ్యాన పద్ధతిని గూర్చి భాస్కరరాయలే "వరివస్యారహస్యం" చివఱలో వివరించాడు. ఆ వివరణ గమనిద్దాం!

**శ్లో॥ శక్త్యా లక్షణయా వా - యేయేర్థాదర్శితా మనోరస్య ।**
**తేషు న కోపి వివాదః - ప్రత్యక్షత్వేన సిద్ధత్వాత్ ॥ 1**

అనగా, అభిధావృత్తితోను, లక్షణతోను కొన్ని అర్థాలు చెప్పబడినవి. కొన్ని అర్థాలు వ్యంజన ద్వారా చెప్పబడినవి. పైగా ఈ అర్థాలు మంత్ర జప ఫలితాల్లో ప్రత్యక్షంగా అనుభవానికి వస్తున్నాయి. కనుక వాటికవి అర్థములు అన్నది ప్రత్యక్ష ప్రమాణం. డిత్థ శబ్దానికి వేఱే అర్థం లేకపోయినను ఆ పేరుతో పలికే వాడే దానికి అర్థం అన్నది ప్రత్యక్షానుభవమే కదా! లేదా,

**శ్లో॥ ఆస్తామన్యావృత్తిః - విలక్షణా, తద్గ్రహస్తు మనోః ।**
**శివవచనేన భవిష్యతి - యద్వైషా శక్తిరేవాస్తు ॥ 2**

అభిధా లక్షణా వ్యంజనలకన్న భిన్నమయిన మఱోశక్తి ఆగమ శివ వచనంతో వచ్చినట్లు కల్పన చేయవలెను. అంటే దీనిని బీజాక్షర శక్తి అందాము. లేదా సర్వశబ్దములకు అర్థములు ఈశ్వర సంకేతము అనే మతం ప్రకారం చూస్తే ఈ 'బీజాక్షర' కల్పన అవసరమే లేదు. ఇది మామూలు 'అభిధావృత్తి' అని చెప్పవచ్చు. ఇది గూడ శివసంకేతం కదా!

**శ్లో॥ ఏతస్మాదయమర్థో - బోద్ధవ్య ఇతీశ్వరేచ్ఛాత్వాత్ ।**
**ప్రతిపదమర్థవిశేషా - జ్ఞానేప్యాస్తామఖండవాక్యస్య ॥ 3**

ఈ మంత్రంలో ఈ దేవతను కొలవమని ఈశ్వరసంకేతం కనుక మంత్ర వాక్యానికి ఈ అర్థం అభిధారూపమే. అఖండ వాక్యార్థం శివసంకేతం. అంటే వాక్యస్ఫోటం ఈశ్వర సంకేతం వలన వచ్చిన అభిధ.

**శ్లో॥ అర్థోప్యఖండరూపో - విశిష్టమతిరిక్తమితి హి సిద్ధాంతః ।**
**అసేచనక వ్యాప్త్యా - దిపదవదాస్తాం పదత్వమపి ॥ 4**

పదార్థాతిరిక్తంగా అఖండార్థం భాసించటం శాస్త్రసమ్మతం కనుక తాత్పర్య శక్తితో అఖండవాక్యార్థం శివసంకేతం అనవచ్చును. లేదా ఒకే అర్థాన్ని చెప్పే మొత్తం మంత్రాన్ని 'పదం' అనే చెప్పవచ్చు. అసేచనకం, వ్యాప్తి అనే పదాలకు విశిష్టార్థంలో శక్తి ఉంది. ఆ మొత్తం విశిష్టార్థం చెప్పినా అవి పదాలే కదా!

**శ్లో॥ ఏకస్యానేకార్థా - దృష్టా హరిసైంధవాదిషు పదేషు ।**
**అన్యగతమేకావగతౌ - ప్రకరణతాత్పర్యయోః విశేషకతా ॥ 5**

"హరి, సైంధవ" మొదలైన పదములకు అనేకార్థములున్నట్లు ప్రకరణ తాత్పర్యములను బట్టి మంత్రపదమునకు / మంత్ర వాక్యమునకు అనేకార్థాలను

చెప్పవచ్చును.

**శ్లో॥ ప్రకృతే తు సర్వబోధ - స్త్యేష్టత్వాత్ నో విశేషకాకాంక్షా ।**
**అథవా సకలార్థేష్వపి - శక్త్యైక్యం పుష్పవంతపదవదిహ ॥ 6**

జపకాలంలో సర్వ అర్థాలు స్ఫురించాలని నియమం. కనుక ప్రకరణాది విశేషాల ప్రస్తావన అవసరం లేదు. లేదా సకలార్థాలు ఒకేశక్తితో స్ఫురిస్తాయని చెప్పవచ్చు. "పుష్పవంతౌ" అంటే చంద్రసూర్యులని రెండర్థాలు ఏకకాలంలో వచ్చినట్లు 15 అర్థాలు ఏకకాలంలో వస్తాయని చెప్పవచ్చును.

వ్యాకరణరీత్యా ఈ అర్థాలను చెప్పే పద్ధతి గూడ చూచించాడు.

**శ్లో॥ ధాతోః బహ్వర్థత్వాత్ - బహుళగ్రహణాత్ పృషోదరాదిత్వాత్ ।**
**ఆకృతిగణపాఠేన - స్వేచ్ఛానుగుణాత్ ఉణాదికల్పనతః ॥ 7**

**శ్లో॥ ఛందసి సర్వవిధీనాం - వైకల్పికతావశాదముష్య మనోః ।**
**సిద్ధిః కథితేర్థేస్మిన్ - వైయాకరణానుశాసనానుమతిః ॥ 8**

అంటే, **'ధాతూనామనేకార్థత్వాత్'** అన్న వచనం వలన, బహుళ గ్రహణాల వలన, పృషోదరాదిగణం ఆకృతిగణం కావటం వలన ఉణాది ప్రత్యయాల బహుళత్వము వలన వేదంలో సర్వవిధులకు ప్రాయికత్వము వలన వేదప్రాయమయిన ఆగమమంత్రము లందు గూడ అర్థకల్పన వ్యాకరణరీత్యానే చేయవచ్చును. దీనికి **"ఆర్షత్వము"** గూడ జోడించినచో మంత్ర మంత్రార్థములు వ్యాకరణ సమ్మతములుగా, పవిత్రములుగా ఉండును.

**"బహుతరసమాసయోగాత్"** అని గూడ మఱొక శ్లోకంలో చెప్పాడు. దాన్నిబట్టి మంత్రబీజములకు సమాస విధానము వలన కొన్ని అర్థములు చెప్పవచ్చును. కనుక బీజాక్షరాలకు, మంత్రాలకు అర్థ సందేహం అవసరం లేదు.

---

# అర్థ విధానం

## (మంత్రార్థాభిధానం నుంచి)

1) బీజ నిఘంటువు నందిచ్చిన అర్థములను గ్రహించి విభక్త్యర్థములను మాత్రము సందర్భానుసారం గ్రహింపవలయును.

**"యథాయథం విభక్త్యర్థం మంత్రార్థే చింతయేత్ శివే"**

మఱియు సమాసంలో విభక్తిలోపంగా భావింపవచ్చును.

2) ఏ బీజాక్షరమునకయినా చివఱ **"బిందువు"** సాధారణముగా ఉండును. ఆ 'బిందువు' కు అర్థములు : **I) నన్ను రక్షించుగాక, II) దుఃఖము పోగొట్టు గాక, III) సుఖములను ఇచ్చుగాక** అని చెప్పుకొనవచ్చును.

**శ్లో॥ యత్ర బిందుద్వయం మంత్రే – ఏకం దుఃఖహరార్థకమ్ ।**
**అన్యత్సుఖప్రదం దేవి – జ్ఞాత్వా చార్థం విచింతయేత్ ॥**

3) మంత్రంలో రెండు బిందువులుంటే దానికి స్వాహా అని అర్థము. లేదా – ఒకటి దుఃఖహరం, రెండవది సుఖదాయకం. ఒకటి పూర్వార్థం, రెండవది పరార్థం. ఇది స్థితి.

**శ్లో॥ యత్ర బిందుద్వయం మంత్రే – అన్యత్పూర్వార్థకం మతమ్ ।**
**స్వాహా మంత్రార్థకం దేవి! – పరార్థం వా ప్రకీర్త్యతామ్ ॥**

4) ఒక మంత్రంలో ఒకే బీజం 2 సార్లు వచ్చినచో వాటికి సందర్భానుసారం అర్థ భేదముతో సమన్వయం చేయవలయును. లేదా అదే అర్థం నొక్కి చెప్పవలయును.

**శ్లో॥ ఏకబీజద్వయం యత్ర – పృథగర్థం ప్రకల్పయేత్ ।**
**వీప్సార్థం వా మహేశాని – జ్ఞాత్వా మంత్రం జపేద్ధియా ॥**

ఈ విధంగా మంత్రార్థ పరిజ్ఞానానికి ఉపయోగించే ఈ బీజములను గూర్చి ఈ గ్రంథమునకు ఆధారమైన ప్రమాణ గ్రంథములు :

**1) శ్రీ తంత్రాభిధానం**
**2) మంత్రాభిధానం – 1**
**3) మంత్రాభిధానం – 2**
**4) ఏకాక్షరకోషం – (పురుషోత్తమదేవరచితం)**
**5) భూత యక్ష డామర తంత్రాంతర్గత బీజనిఘంటువు**

**6)** **మాతృకా నిఘంటువు - 1 (మహీదాసవిరచితం)**

**7)** **మాతృకా నిఘంటువు - 2 (మధ్వాచార్యరచితం)**

**8)** **మాతృకా నిఘంటువు - 3**

**9)** **వర్ణ నిఘంటువు - రుద్రయామలతంత్రం**

**10)** **బీజాభిధానం - భూతడామరతంత్రం**

**11)** **మంత్రార్థాభిధానం - వరదాతంత్రం**

**12)** **ముద్రానిఘంటువు - వామకేశ్వర తంత్రం**

ఈ గ్రంథములన్నింటికి సంపాదకులయిన **"ఆర్థర్ ఎవలాన్"** గారికి నమస్కారములు.

ఇదిగాక 'ఆంధ్ర విజ్ఞాన కోశం' తదితర యోగశాస్త్ర కర్తలకు ఆగమతంత్ర ప్రవర్తకులయిన **ఉమామహేశ్వరులకు** నమస్కారము. **శ్రీ రావి మోహనరావు** గారు ఈ గ్రంథం వ్రాయమని నన్ను కోరినందుకు వారికి నా నమోవాకములు. ధన్యవాదములు.

ఇట్లు

**మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి**

శ్రీః

# బీజ తంత్రం

## అక్షర బీజాలు

**(ప్రతి పదం చివర 'బీజము' అని చేర్చి చదవవలెను)**

... .... ...

## अ - అ

**అవయవాలు** : తల, నుదురు, లలాటజ, కంఠ

**దేవతలు** : బ్రహ్మ, వాగీశ, కేశవ, శివ, సురేశ, విఘ్నేశ, అమృతేశ, శ్రీకంఠ, వాసుదేవ, మహాబ్రహ్మ, ధనేశ, వామా, ఆదిమాతృకా, బ్రహ్మాణీ, కామేశ్వరీ, అశ్వని, కామాకర్షిణి.

**గ్రహాలు** : అర్కమండలం.

**పంచభూతాలు** : వాత, మరుత్, వియత్.

**జంతువులు** : లేవు.

**ఇతరాలు** : అమృత, నివృత్తి, ప్రణవాది, కామరూప, మాతృకాది, కలాది, ఆద్యజ, ప్రతిపత్తి, స్థిర, ప్రతిపత్తిథి, వర్ణాది, బ్రాహ్మణ, సర్వాది, లఘు, హ్రస్వ, ఏకమాత్రక, ఏకమాతృక, పూర్ణోదరీ, సృష్టవేద, సారస్వత, ప్రియంవద, విద్యుజ్జిహ్వా, భీషణ, కీర్తి.

# आ - ఆ

**అవయవాలు** : ముఖం, వక్త్ర, ముఖవృత్త, హృదయ, అంగుష్ఠ,

**దేవతలు** : అనంత, విష్ణుశయ్య, శేష, విష్ణురాజ, వాసుదేవ, నారాయణ, బ్రహ్మ, విజయ, రుద్ర, పితామహ, భగమాలినీ.

**గ్రహాలు** : గురు, కుజ.

**పంచభూతాలు** : మరుత్, భూమి, వియత్.

**జంతువులు** : గజేంద్ర, గజాంతక.

**ఇతరాలు** : దీర్ఘ, ద్వితీయక, ప్రతిష్ఠ, దీర్ఘచ్ఛాయ, మేఘ, క్షీరోదధి, పాశ, దీర్ఘాస్య, వృత్తక, ప్రచండ, ఏకజ, మానదా, కాంత, విశ్వాంతక, అంతక, ద్వితాంత, క్రియ, కాంతి, సంభవ, కాశి, స్వరాంతక, చరుజ, తామసీ, పూజ, మాంగల్య, తారక, కాలవజ్రీ, కాలజిహ్వా.

# इ - ఇ

**అవయవాలు** : దక్షిణనేత్ర, కన్ను, ముక్కు, భ్రూమధ్య.

**దేవతలు** : మాధవ, గుహ్యక, గణపతి, రుద్ర, నిత్యక్లిన్నా, రుద్రభైరవి, పాంచజన్య, పరమేశ, గంధర్వ.

**గ్రహాలు** (తారలు) : పూషా, భరణి.

**పంచభూతాలు** : పావక, అగ్ని.

**జంతువులు** : లేవు.

**ఇతరాలు** : సూక్ష్మ, శాల్మలీ, విద్య, మిత్ర, కామ, సుందర, వీర, కోటర (తొఱ్ఱ) వయః, తుష్టి, శాంత, కాంత, కామినీ, నేపాల, గర్జినీ, చండా, మఖాంకుర, మఖాంతక, విట్, బిందు, ద్విబిందు, పరమ.

## ई - ఈ

**అవయవాలు** : కుచద్వంద్వ, తర్జని, వామాక్ష, జిహ్వా.

**దేవతలు** : శివోత్తమ, కామకలా, ఇంద్రమూర్తి, గోవింద, త్రిమూర్తి, కమల, మాయ, లక్ష్మి, నృసింహాస్త్ర, త్రిపురసుందరి, శూలిని, బైందవి, చండోగ్రా, ధూమ్రభైరవి, వైష్ణవి, బిందుమాలిని, భేరుండ, శివా.

**గ్రహాలు** : లేవు.

**పంచభూతాలు** : వహ్ని, పావక.

**జంతువులు** : లేవు.

**ఇతరాలు** : కాలకారికా, శాంతి, కల రతి, లోలాక్షి, శేఖర, తుష్టి, పుష్టి, కీర్తి, సుభద్ర, రత్న, ప్రహాస, వాగ్విశుద్ధి, పరాపర, కాలోత్తరీయ, పౌంద్రవర్ధన, చతుర్ధ, సనాదక, కోటర, మోహినీ, శుద్ధ, వాగ్మి.

## उ - ఉ

**అవయవాలు** : కుడి చెవి, చెవి.

**దేవతలు** : శివ, విష్ణు, అమరేశ, షడానన, ఉగ్రప్రభు, విశ్వకర్మ, శత్రుఘ్ను, వహ్నివాసిని, విఘ్నేశ్వర, మన్మథ, చండవల్లభ.

**గ్రహాలు** : లేవు.

**పంచభూతాలు** : మహీ, ధరా.

**జంతువులు** : వృష.

**ఇతరాలు** : ప్రణవ, వర్తులాక్షీ, భూత, కల్యాణవాచక, మోహన, ధృతి, చేటికా, పుష్టి, పంచమీ, కామఘు, కామనా, కుటిలా, పారద్వీప, ఇంధికా, గజాంకుశ, విజయ, తమోహన, బభ్రూ, వృత్తాక్షి, ప్రచండ, కాలకూట, కాల, కాలరాత్రి.

# ऊ - ఊ

**అవయవాలు** : వామకర్ణ, చెవి, సర్వశ్రోత్ర, వామాంస.

**దేవతలు** : అర్ఘీశ, మధుసూదన, రతి, కపాలినీ, నవభైరవ, మహేశ, భైరవ, సరస్వతి, విఘ్నహర్తృ, లక్ష్మణ, మహావిద్య, ఈశ్వరి, షణ్ముఖ, రూపాకర్షిణి.

**గ్రహాలు** : కుజేశ, ఇంద్రచాప.

**పంచభూతాలు** : క్షమ, భూమి.

**జంతువులు** : లేవు.

**ఇతరాలు** : విదారి, తాలజంఘ, నాలజంఘ, కంటక, శాంతి, క్రోధన, కామరాజ, సూక్ష్మ, దీర్ఘఘోణ, విలాసిని, షష్ఠీ, షండ, దీపిక, కాన్యకుబ్జక, రక్షణ, షట్స్వర, ప్రజేశ.

# ऋ - ఋ

**అవయవాలు** : ముక్కు, కుడి ముక్కు, ఏకపాద, శిరః, కర్ణః, మేదః (క్రొవ్వు)

**దేవతలు** : త్రివిక్రమ, రుద్ర, దేవమాతృ, గణనాయక, రోహిణి, శివ దూతీ, దేవమాతృ, శత్రుఘ్న, రుద్రమాయ, మహారౌద్రి, జ్వాలినీ, యోగినీ.

**గ్రహాలు** : తపన.

**పంచభూతాలు** : జల.

**జంతువులు** : లేవు.

**ఇతరాలు** : భారభూతి, భావభూతి, భారభూమి, ఊర్ధ్వముఖీ, క్రియా, క్రూర, రేచిక, ధృత, మాలా, మండల, శాంతినీ, కామలభా, నివృత్తి, పూర్ణగిరి, సప్తమీ, విగ్రహాధిప, ఋజ్మూర్తి, యతి, ధర్మ.

## ॠ - ౠ

**అవయవాలు** : ఎడమ ముక్కు

**దేవతలు** : వామనుడు, అధీశ్వరుడు, అమృతేశ, శ్రీకంత, అతిధీశ, త్రిపురాంతక, వాణీ, స్థాణు, దైత్యమాతృ, ఏకదంత, అగ్ని, గంధాకర్షిణి, దితి, దను, కాలికా, శ్రీః.

**గ్రహాలు** : లేవు

**పంచభూతాలు** : అగ్ని, వారి.

**జంతువులు** : గో, గోముఖీ.

**ఇతరాలు** : క్రోధ, వారిధి, మోచికా, అక్షాగ్రజ, దేవజుష్టస్వర, భయంకర, పితృకాలీ, ధృతి, స్వర, స్థాయి, ఊర్ధ్వముఖీ, ఊర్ధ్వమూర్తి, పద్మమాలా, నిశానధీ, వినష్టధీ, శశినీ, శ్రేష్ఠ, ప్రతిష్ఠితా, ప్రతిష్ఠ, మాతృ, హరిత, మిథునోదయ, మాయాగ్రజ, కోమల, శ్యామల, మేధీ, పతి, అష్టమీ, బ్రహ్మణ్య, కలాల, దైవజ్ఞ.

## ऌ - ఌ

**అవయవాలు** : దక్షిణ గండ.

**దేవతలు** : స్థాణు, శ్రీధర, హృషీకేశ, రుద్రక, వహేశ, విశ్వేశ్వర, మహేంద్ర, అమృతేశ్వర, కులసుందరీ, సంహారిణీ, చిత్తాకర్షిణి, వేధ, పరా.

**గ్రహాలు** : లేవు.

**పంచభూతాలు** : వియత్.

**జంతువులు** : లేవు.

**ఇతరాలు** : మేఘనాదా, విభు, ఉగ్రభాషిణీ, ద్విదంత, కాశ, వామార్ధ, తృతీయ, కామవర్ధన, అద్రి, శుచిస్మిత, ఏకాంఘ్రి, వజ్రదండ, త్రివేదక, త్రిదేవక, శుద్ధ, ధూమ్ర, వక్ర, దేవయోని, రాజ, కాంత, దీర్ఘజిహ్వ, విశేష, లాంగలి, చంద్రిక, ధూమ్ర, నవమి, కాంతి, చామర.

# ऌ - ఌ

**అవయవాలు** : వామగండ, ఉదరార్ధ.

**దేవతలు** : హృషీకేశ, హర, గణపతి, కమల, కరాలిని, రద్రచంద్రీ, కాలరాత్రి, కామోదరి, శక్ర, గజానన, కుండోదరి, హరీశ, విశ్వపా, దితి, ధైర్యాకర్షిణీ, దను.

**గ్రహాలు** : సూర్య.

**పంచభూతాలు** : ఖ.

**జంతువులు** : మధువ్రత.

**ఇతరాలు** : కుబేరాక్ష, హర్ష, సూక్ష్మ, కాంతి, సురా, కాంతికృత్, శాంతికృత్, స్వస్తిక, మాయావి, లోలుప, దశమి, సుస్థిర, మాతృ, నీల, పీత, కామిని, కాల, నిత్య, శుద్ధ, కృతి, ఏకాకి, అర్ధర్చ, నీలచరణ, త్రికంఠ, త్రికూట, ద్విదంత.

# ए - ఏ

**అవయవాలు** : ఓష్ఠ, జంఘా, ఊర్ధ్వోష్ఠ, ఊర్ధ్వదంత, దక్షదంత, ఊర్ధ్వకేశ.

**దేవతలు** : పద్మనాభ, ఘంటేశ, శక్తి, సిద్ధీశ, చాముండా, విజయ, ఊర్ధ్వకేశీ, భగవతీ, కుండలీ, ఆధారశక్తి, ఈశ, గజానన.

**గ్రహాలు** : మరుత్, సూక్ష్మభూత, వహ్ని, క్షమా.

**జంతువులు** : లేవు.

**ఇతరాలు** : నాదిని, చర, వాగ్భవ, జ్యోత్స్నా, శ్రద్ధా, ప్రమర్దన, భయ, జ్ఞాన, కృప, కృశ, ధీర, సర్వసముద్భవ, మోహిని, రస, యేషిత్, త్రికోణా, సంధి, ఏకాదశీ, భద్రా, కులాచల, అమృత, కామరూప, ఊర్ధ్వహస్త, గజజ్యోతి.

# ऐ - ఐ

**అవయవాలు** : అధరం, వామజాను, ఊర్ధ్వదంత, అధోదంత.

**దేవతలు** : నిరంజన, దామోదర, ఉగ్రభైరవి, ఉన్మత్తభైరవి, మాలిని, కపర్ది, శ్రీఅగ్ని, మాతృక, త్రిపుర, రాజ్ఞీ, వాగీశ, మహేశ్వర, సరస్వతి, భౌతికేశ, భౌతీశ, కామకోటి, విజయ, పీఠేశ, జగద్యోని.

**గ్రహాలు** : అంశుమాన్.

**పంచభూతాలు** : భూతిక, అగ్ని, ధరా, మరుత్, ప్రవాత.

**జంతువులు** : లేవు.

**ఇతరాలు** : అష్టస్వర, ద్వాదశస్వర, శుచి, ద్వాదశీ, లజ్జా, కాంతా, వాయవీ, మోహినీ, విభు, దక్ష, ప్రజ్ఞ, వికృతముఖి, క్షమ, కోటరాక్షి, వర్మ, భయద, ధీరేంద్ర, పర, పరనిబోధకృత్, జ్ఞానామృత, లోహిత, వాగ్భవ, వాక్, భౌతికాసన, విమల.

# ओ - ఓ

**అవయవాలు** : దంత, దీర్ఘజంఘక, ఊర్ధ్వదంత, ఊర్ధ్వాస్య.

**దేవతలు** : త్రైలోక్య విజయా, బీజాకర్షిణీ, సంకర్షణ, ఏకదంత, సద్యోజాత, వాసుదేవ, బ్రహ్మ, రుద్ర, అజేశ, లక్ష్మీ, చండమాలిని, సర్వ మంగల, రతినాథ, దిగంబరా, మంత్రనాథ, మాత్రేశ, జ్వాలిని, గాయత్రి, వాణి.

**గ్రహాలు** : సుధాకర.

**పంచభూతాలు** : భూ,

**జంతువులు** : లేవు.

**ఇతరాలు** : రథ, భువన, భీమాక్ష, నగ, నాగ, త్రిమాత్రిక, త్రిమాతృక, సత్యక, పీయూష, శ్రుతి, పశ్చిమాస్య, స్థిర, ఆప్యాయనీ, సుముఖి, ద్విజ, ఉద్దేశ్యదర్శక, తీవ్ర, కైలాస, వసుధాక్షర, ప్రణవాంశ, బ్రహ్మసూత్ర, త్రయోదశ, దీర్ఘనాస, ప్రజ్ఞ, ప్రీతి.

# औ - ఔ

**అవయవాలు** : దంతాంతం, అధోదంత, కంఠ, ఓష్ఠ, నేత్రం.

**దేవతలు** : సంకర్షణ, అనుగ్రహేశ్వర, శక్తిక, నాథ, సదాశివ, సరస్వతి, ఢాకిని, సింహనాదిని, రుద్ర, చండభైరవి, నృసింహాంగం, జ్వాలిని, రతిప్రియ, ఆత్మాకర్షిణీ, జ్వాలామాలిని, మురారి, మాయి, ప్రద్యుమ్న.

**గ్రహాలు** : గ్రహేశ, మిత్ర.

**పంచభూతాలు** : తైజస, వ్యోమ, అనిల.

**జంతువులు** : లేవు.

**ఇతరాలు** : మనువు, వన, వామజంఘక, మణిబంధ, శంఖకర్ణ, ఆజ్ఞ, ఊర్ధ్వముఖి, శాంత, శాంతిక, వ్యాపిని, ప్రకృతి, పయః, అనంతా, చతుర్దశీ, భృగు, నాదాక్షి, దీర్ఘవక్త్ర.

# अं - అం

అవయవాలు : శిరోగత, చక్షుర్, దంత, తల, ఊర్ధ్వదంత.

దేవతలు : ప్రద్యుమ్న, అనిరుద్ధ, అక్రూర, రుద్రరాకిణి, పరంబ్రహ్మ, వృషధ్వజ, ప్రమాణీశ, గుహ్యక, శ్రీముఖి, అనంగ, అమృతా కర్షిణి.

గ్రహాలు(తారలు) : కన్యాచర రవి, శశి, సోమ, రేవతి.

పంచభూతాలు : ఆకాశ.

జంతువులు : లేవు.

ఇతరాలు : సుఖదుఃఖ ప్రవర్తక, పూర్ణిమా, శుద్ధ, బీజయోని, పర, ఘటికా సమ, శూన్య, విచిత్ర, కేదార, రాత్రినాశ, అనుస్వార, ఘంటిక, దండ, బిందు, దండి, స్థితి, కుబ్జికా, బుద్బుద, నిగూఢ, స్వర, మాన, విదారి, కవచ, అంకార, చంచు, మరణ, ప్రీతి, చేతన, నాద, పూర్ణా, దుఃఖహర, నరేశ, శంకుకర్ణ.

# अः - అః

**అవయవాలు** : విషమమనస్సు, కంఠక, ముఖ.

**దేవతలు** : అనిరుద్ధ, మహాసేన, కార్తికేయ, రమ, గణేశ, రతి, శక్తి, అనంత, మహేశ్వర, హరి, సంహారకర్తృ, అమరేశ, కపాలిని, చండిక, అమృతా, సుందరీ, మాయ.

**గ్రహాలు** : సోమ.

**పంచభూతాలు** : అనంతా.

**జంతువులు** : ద్విజిహ్వా.

**ఇతరాలు** : విసర్గ, సర్గ, విపత్, అంతిమస్వరః, బింద్వంత, నిరుద్ధక, కన్యాస్తననిభ, కుండలద్వయ, ద్విబిందు, శిల్పాభిజ్ఞ, కలాజ్ఞ, రసవర్ణక, రసనార్ణక, రసనా, కంటక, కలా, పూర్ణా, భద్రా, ఇచ్ఛా, హుం, విద్య, సుఖదుఃఖసూచక, యామ్యా.

# क - క

**అవయవాలు** : ముఖ, మస్తక, దక్షిణస్కంధ, కర, యామ్యకర్ణాది, దక్షిణ మూలగ, చరణ.

**దేవతలు** : క్రోధీశ, గణేశ, చక్రి, వ్రతదేవ, సుర, మహాకాలీ, కామదేవ, కపాలి, వాసుదేవ, ప్రజాపతి, బ్రహ్మ, మహేశ్వర, కామేశ్వరి, కామాంగ, పరమాత్మ, ఆత్మ, అనంగకుసుమ, మాయ, దేవేశ, నిత్యా.

**గ్రహాలు(తారలు)** : రవి, చంద్ర, తుల (రాశి)

**పంచభూతాలు** : తైజస, జలం, వహ్ని, వాయు, ప్రాణ, భూమి.

**జంతువులు** : గజేంద్రక.

**ఇతరాలు** : కామగ, కార్ణక, స్వరాంతక, స్వరాంగక, ప్రకాశక, శాంతి, విశాంపతి, బిందు, తాపిని, పరమార్థక, వర్గాద్య, సఖి, సముద్ర, పుష్ప, మంగళ, కామరూప, శ్రీపుర, రమణ, వంగకుసుమ, సృష్టి, గది, రోగ, ముద్ర, సుఖ.

# ख – ఖ

**అవయవాలు** : దండజాతీశ, కఫోణి, దక్షిణకూర్పర, దక్షిణబాహు.

**దేవతలు** : చండ, చండీశ, సరస్వతి, ప్రచండ, దుర్గ, తాపిని, గరుడ, కపాలి, లింగ, వామన, కైటభారి.

**గ్రహాలు** : గురు.

**పంచభూతాలు** : ఆగ్నేయ, తేజః, వహ్ని, ఆకాశ, ఇంద్రియ.

**జంతువులు** : శిఖండి, మాతంగ, ఖగ, సర్ప.

**ఇతరాలు** : ఖార్ణక, బుద్ధి, యతి, శూన్య, స్వర్గ, గదీ, కామరూపి, కాంత, కల్యాణీ, శూర్పకర్ణ, అజరామర, శుభ్ర, శ్వభ్ర, జనవ్యాపార, ఖడ్గక, ఖేట, సంహార.

# ग – గ

**అవయవాలు** : హృదయ, మణిబంధగ.

**దేవతలు** : శార్ఙ్గీ, శారంగ, పంచాంతక, గౌరి, గణేశ, గంగ, గోకులేశ్వర, గంధర్వ, శివదర్శన, విశ్వాత్మ, త్రిలోచన, సరస్వతి, జాలంధర, హవీశ, స్వర్గగ.

**గ్రహాలు** : లేవు.

**పంచభూతాలు** : ధరా, స్థిరా.

**జంతువులు** : గౌరి, సింహ, గజకుంభ.

**ఇతరాలు** : ఖాంత, స్మృతి, గీత, గాధా, గౌః, మాతా, శూర్పకర్ణ, గౌరవ, సర్వగ, సర్వసిద్ధి, ప్రభా, ధూమ్రా, ద్విజాఖ్య, పృథగ్రూప, బాలబద్ధ, విద్య, భోగిని, నందన, జ్ఞాన, లవ, నర, గోముఖ.

# घ - ఘ

**అవయవాలు** : దక్షిణకర, దక్షిణాంగులిమూల.

**దేవతలు** : శివోత్తమ, శివ, ఘంటీశ, త్రిపురాంతక, మరీచి, వరుణ, నందీశ, లాంగలి, ముసలి, లంబోదర, త్రైలోక్యవిద్య.

**గ్రహాలు** : లేవు.

**పంచభూతాలు** : వాయు.

**జంతువులు** : వరాహ, గో, ఘుర్ఘుర.

**ఇతరాలు** : గాంత, ఘూర్ణక, ఖాదిమ, మేఘ, మేథ, ముషలీ, ఘంట, కింకిణి, ఖడ్గి, ఖండి, సత్య, నవ్య, ఘోరనాదక, ఘోరనామ, జ్వాలమాల, కాలరూపి, కామరూపి, దాంభిక, శివాఘ, హనన, ధ్వని, ధనకామ, ఘనస్వర, వికారి, శంక, ఘన, సంహర్త, కామాఖ్య, అనఘామయ, మూలదంతుర.

# ङ - ఙ

**అవయవాలు** : దక్షిణనఖ, నఖ, దక్షిణాంగుళ్యగ్రస్థిత, దక్షిణహస్త.

**దేవతలు** : రుద్ర, భైరవ, చండ, ఏకనేత్ర, ఏకరుద్ర, మదన, విఘ్నపతి, ఆత్మనాయక, శివయోష, కామేశ, భద్రేశ, దామరేశ, ఉన్మత్త భైరవ, జ్వాలినీ, మంత్రశక్తి, మహానంద.

**గ్రహాలు** : చంద్ర.

**పంచభూతాలు** : వియత్, వాయు.

**జంతువులు** : లేవు.

**ఇతరాలు** : జార్ణక, బిందూత్తంస, శంఖీ, లంబ, శిశు, ఖర్పర, విషయ, స్పృహా, అనునాసిక, కాంతి, శ్వేతాహ్వాయ, ధీర, ఘన, ద్విజ, జ్వాలినీ, దుర్భర, యతి, గత, మయ, అంశుక, క్లీబవక్త్ర.

# च - చ

**అవయవాలు** : వాయుజంఘ, వామబాహు.

**దేవతలు** : శూలీ, వాలీ, వాణి, ఆత్మశక్తి, సుదర్శన, లక్ష్మి, చాముండ, చతుర్మూర్తిస్వరూపిణి, తృతీయలోచన, దేవి, కౌమారి, జ్వాలాముఖి, అనంగమేఖల, దైవ, ఇచ్ఛాత్మ.

**గ్రహాలు(తారలు)** : చంద్ర, బుధ, భౌమ, పూర్వఫల్గుణీ.

**పంచభూతాలు** : వాయు, మేదిని.

**జంతువులు** : కూర్మ, వృశ్చిక, కీటముఖీ.

**ఇతరాలు** : కూర్చ, పుష్కర, ఏకరూప, చామర, రుచి, దీర్ఘబాహుక, చిత్రచారి, చిత్తవారి, దయిత, ద్వినేత్ర, చంద్రక, చందన, చేతనా, ఇచ్ఛా, సాయక, నర, తస్కర, మహానాద, మాలావతి, చంచల, దిక్, ప్రభ.

# छ - ఛ

**అవయవాలు** : వామకూర్పర, వామ, వామబాహు, పాయు.

**దేవతలు** : ముషలీ, ఏకనేత్ర, సుషుమ్ణా, పశుపతి, పాశి, చతుర్మూర్తి, ఏకమాతా, లాంగలీ, సదాశివ, జయ.

**గ్రహాలు** : లేవు.

**పంచభూతాలు** : వహ్ని, భూతమాత్రా.

**జంతువులు** : పశు.

**ఇతరాలు** : త్రిబిందుక, తథాచారీ, ఏకపాద, చందన, జ్వరి, ప్రేక్షక, శ్లేష్మక, తరణీ, శ్లేషక, రక్తదంష్ట్రా, శ్లేషాంతక, మతి, నిర్మల, తరల, ద్విశిర, విలాసిని, వృషలి, గోకర్ణా, కామకర్త, మాత, నిశాచర, విక్షత, స్థితి శబ్దక, ద్యుతి.

# ज - జ

**అవయవాలు** : వామకూర్పర, వామ, మణిబంధగత.

**దేవతలు** : శివ, శూలి, చతురానన, జయంత, లంబోదరీ, మారుతేశ్వర, నంది, సురాధిప, జపజ్యోతి.

**గ్రహాలు** : లేవు.

**పంచభూతాలు** : ధరా, తేజః, కం, అర్చిః.

**జంతువులు** : వానర, హంస.

**ఇతరాలు** : జయజ, శవ, భాగద, విజయ, స్థిర, జేతా, ధాతకీ, సుముఖీ, విభు, స్మృతి, శాఖా, సుప్రభా, దీర్ఘబాహు, రుచి, జవన, వేగిత, మానవాక్ష, మృత, సదాత్మక, జపక, జనక, జార్ణక, జఘన, మదవిహ్వల, అసితాంగ, అనాకార, ఆమోద.

# झ - ఝ

**అవయవాలు** : అంగుళిమధ్యపర్వ, అంగులీమూలగ, వామాంగుళితలస్థిత, వామహస్త, జిహ్వా.

**దేవతలు** : పాశి, అజేశ, గుహుడు, ఆత్మ.

**గ్రహాలు (రాశులు)**: కుజ, ధసుర్వస్త.

**పంచభూతాలు** : జలం, స్థిరా, అభ్రం, ఝంఝూవాయు.

**జంతువులు** : లేవు.

**ఇతరాలు** : ఝాంత, ఆమోద, కుముద, ఝంకార, కంకణ, చంద్రిక, దక్షహాస, దక్షశాఖ, అట్టహాస, పాపాత్మ, దీర్ఘబాహు, కృత మండల, బడబాముఖ, వలయాముఖ, కుచమండల, సత్య, షడున్నత, ద్రావిణీ, నాద, విఖ్యాతక, జాలంధరస్థితా, విరాజేంద్ర, కర్మశ, నాదజ, బల, రూప, ఆక్రందిత, సుచంచల, దుర్ముఖ, నష్ట, వికట, ఖండ, కలహంసప్రియ, స్వస్తిక, వ్యంజన, స్వర.

## ञ - ఞ

**అవయవాలు** : సవ్యాంగులనఖ, వామాంగుళ్యగ్ర.

**దేవతలు** : కౌమారి, చందనేశ్వరి, పుష్పధన్వా, నిరంజన, సర్వేశ్వర.

**గ్రహాలు** : సోమ.

**పంచభూతాలు** : వియత్.

**జంతువులు** : బక.

**ఇతరాలు** : అనునాసిక, జ్ఞప్రియ, సర్వక, అంకుశి, బోధిని, విశ్వా, కుండలి, సుఖద, దుఃఖద, నాగవిజ్ఞాన, చూర్ణితా, బుద్ధి, సిద్ధి, స్వర్గాత్మ, ఘుర్ఘరధ్వని, రస, ధర్మ, ఏకపాద, సుముఖీ, విరజా, దుర్ముఖ, గాయన, రాగాత్మ, వరాక్షి, జ్ఞప్తిద, నంద, విద్విట్, సిద్ధ, నాద, శుభ, దీర్ఘబాహు, విద్యున్ముఖ.

## ट - ట

**అవయవాలు** : దక్షిణస్ఫిక్, దక్షిణపాదమూల, దక్షిణపాదాదిగ, దక్షిణాంగక, కటి, వామకటి.

**దేవతలు** : సోమేశ్వర, లాంగలి, ముకుంద, కపాలి, వైష్ణవి, వారుణి, నంది, సోమజా.

**గ్రహాలు(రాశులు)** : అర్ధచంద్ర, బృహస్పతి, ధనుః

**పంచభూతాలు** : భూమి, మరుత్.

**జంతువులు** : లేవు.

**ఇతరాలు** : టంకార, భూతి, పునర్భవ, ధనుః, మహాధనుః, జరా, ఖేచర, ధ్వని, నినదా, నవ, చిత్ర, ప్రమద, ప్రమోద, విమల, రాజా, గిరి, ఘ్రూణాత్మా, సుముఖ, గజాంకుశ, అమృతాద్య, దావ, మహాజ్వాల, మృగాద్య.

## ర - ఠ

**అవయవాలు** : జిహ్వా, కరతలద్వయం, వామజానుగ, దక్షిణజానూరుభాగ, లలాట, యామ్యగుల్ఫ.

**దేవతలు** : లాంగలీశ, నందయోని, పాలినీ, కపాలీ, విష్ణు, మహేశ, నలిని, అర్ధనారీశ, దివ్యనాయక.

**గ్రహాలు** : చంద్ర, చంద్రమండల, పూర్ణచంద్ర, సుధాబింబ, భౌమజ.

**పంచభూతాలు** : వహ్ని, కు.

**జంతువులు** : లేవు.

**ఇతరాలు** : ఘటాకార, కమండలు, శూన్య, మంజరీ, బీజం, పాణి, క్షయ, వనజ, నందన, ఘూర్ణన, వర్తుల, అమృత, కుండల, జీవన, జీవ, దేవజాక్ష, బృహత్ ధ్వని, ఏకపాద, విభూతి, సర్వమిత్రక, వృషఘ్న, గ్రామణి, స్థాయి, స్థవిర, ప్రమోద, నదజ్ఞ, ప్లావక.

## డ - డ

**అవయవాలు** : దక్షిణగుల్భగ, లోచన, వామబాహు, దక్షిణజాను, యామ్యజాను.

**దేవతలు** : దారుక, నంది, యోగిని, కౌమారి, శంకర, త్రివక్త్ర, శూలి, యోగినీప్రియ.

**గ్రహాలు-తారలు** : భౌమజ, స్వాతి.

**పంచభూతాలు** : భూమి.

**జంతువులు** : వ్యాఘ్రపాద, కోల.

**ఇతరాలు** : ఖడ్గార్ధాకార, శుభాంఘ్రి, నర, ఏకపాద, దండ, వత్సల, భీషణ, త్రాస, క్షాంతి, దారక, చామర, డామర, గిరి, శాంతి, నాభి, స్వాతి, స్మృతి, త్రివక్ర, నదక, ధ్వని, దురూహ, జటిల, భీమ, ద్విజిహ్వ, సతీ.

## ढ – ఢ

**అవయవాలు** : దక్షిణపాదాంగులిమూల, సవ్యబాహు, దక్షిణజంఘాత్వక్.

**దేవతలు** : అర్ధనారీశ, యజ్ఞేశ, నదేశ్వర, ఈశ్వరీ, ఐశ్వరీ, వినాయక, విఘ్నేశ, శ్రీ, హరిః.

**గ్రహాలు-తారలు** : గురు, విశాఖ.

**పంచభూతాలు** : ఆకాశ, తోయ.

**జంతువులు** : ద్విజిహ్వా, క్రోడపుచ్ఛక, మీన.

**ఇతరాలు** : శంఖాంతరాకృతి, నర, నవ, పూర్ణ, సంకోచ, ఢక్కా, నిర్ణయ లోహ, త్రిశిఖీ, సిద్ధిదండ, దాయాద, దృఢ, ప్రహాస, దాహక, బుద్ధి, నిర్గుణ, నిదాన, ధ్వని, పాలిని, ఏలాపుర.

## ण – ణ

**అవయవాలు** : శ్రోత్రం, దక్షసాదాంగులిన (ము)ఖ, దక్షిణపాద.

**దేవతలు** : ఉమాకాంత, నరకజిత్, ఆషాఢీశ, రతి, పక్షివాహన, జయా, యోగినీప్రియ, త్రినేత్రః, నారాయణ, రాఘవ, శంఖినీ.

**గ్రహాలు** : రవి.

**పంచభూతాలు** : వ్యోమ.

**జంతువులు** : లేవు.

**ఇతరాలు** : నిర్గుణ, జ్ఞాన, జృంభణ, నిష్కల, ద్విముఖ, సమృద్ధి, బోధినీ, ద్వినేత్ర, మానుషీ, శూర, నిర్ణయ, నిర్వాణ, త్రిగుణాకార, ప్రహారీ, సంహారీ, త్రిరేఖ, తారక.

# त - త

**అవయవాలు** : వామస్ఫిక్, వామకటి, మధ్యకర్ణ, వామపాదాది, ఊర్ధ్వజానుక, వామోరుమూల.

**దేవతలు** : నీల, హరి, పూతన, గోవింద, శక్తి, వారాహీ, అరుణ, భైరవ, జయంత, ధాతా, అనంగమదనాతుర, సుగత.

**గ్రహాలు-తారలు** : అనూరాధ, మీననిలయ.

**పంచభూతాలు** : శిఖి, మరుత్.

**జంతువులు** : హస్తి, అశ్వ, మకర.

**ఇతరాలు** : ణాంత, థాది, ఆపటీ, తటిత్, తారా, తీవ్ర, తరల, హవిః, శుద్ధి, గంధ, బింబ, జటీ, ధ్వజా, కామినీ, ఆషాఢీ, తారక, ఛత్ర, రౌరవ, మూలనిలయ, మీననిలయ, పులక, భ్రాంతి, తండతుస్న, కామికా, పృష్ఠపుచ్ఛక, రత్నక, శ్యామముఖీ, చోర, అర్ధముఖి, బుద్ధజాను, క్రోడపుచ్ఛక.

# थ - థ

**అవయవాలు** : దక్షిణనాసాధర, వామజాను, శిరసిజ, కేశ, లోల.

**దేవతలు-రాక్షసులు:** భద్రకాలీ, కృష్ణ, షణ్ముఖ, గుహ్యా, విశాలాక్షి, అమర.

**గ్రహాలు-తారలు** : శరచ్చంద్ర, దివాకర, సౌరి.

**పంచభూతాలు** : అనల, గోత్రా.

**జంతువులు** : లేవు.

**ఇతరాలు** : దండి, కుష్ఠ, స్థిరామ, మహాగ్రంథి, గ్రంథిగ్రాహ, భయానక, రక్షణ, స్థిరస్థాయీ, సూచీపుర, వరద, దండి, స్థవిర, స్త్రీ, కమండలు, రస, శిలి, శిలోచ్ఛయ, బుద్ధి, వికర్మ, భోగద, ఉజ్జయిని.

